## సంస్కృతభారతీ గ్రంథమాలా : ప్రథమపుష్పమ్

## సంస్కృతభారతీ







సంపాదకౌ

శ్రీ పుల్లెల శ్రీరామచంద్రః

శ్రీ చలమచర్ల వేంకట శేషాచార్యః

సంస్కృతభాషా ప్రచార సమితి

# మా మాట

భారతదేశ మొకప్పుడు ప్రపంచములోని దేశములకెల్ల తలమానికమై వాసికెక్కుటకు మన భారతీయసంస్కృతియే ప్ర ధానకారణము.పలువురి సుఖము,హితము లక్ష్యముగా గైకొని మన ప్రాచీనమహర్షులు మహాతపస్సుచేసి,వివిధ విజ్ఞానముల నెన్నడో వెలయించిరి. అయినను వారంతటితో తృప్తినందక పరమార్ధచింతనతో నాత్మజ్ఞానమును సముపార్జించి యా జ్ఞా నవిజ్ఞానములను తమ శిష్యసంతతి కొసంగిరి.ప్రాచీన భారతీ య సంస్కృతిని ప్రతిబింబించు నీ సకల జ్ఞానవిజ్ఞానసంపద సం స్కృతభాషయందే ఉన్నది.కావున నా సంపద నాత్మీయ మొన ర్చుకొనగోరువారలకు సంస్కృతభాషయే శరణ్యము.కుల-మ త-భాషా భేదము లేక యెల్లరును నేడు సంస్కృత మభ్యసింప నుత్సాహపడుచున్నారు.అందఱకు సంస్కృతమున సులభప్రవేశ ము కలిగించు నుత్తమలక్ష్యముతో సంస్కృతభాషా ప్రచార సమి తివారు “సంస్కృతభారతీ” పరీక్షలను నిర్వహించుచున్నారు. సంస్కృతము నేర్చుకొనగోరువారికి క్లేశము కలుగకుండ మొద టి పరీక్షయగు 'ప్రవేశికలో నాగర లిపిగాని,లిఖితపరీక్షగాని ని ర్బంధ మొనర్చియుండలేదు.మౌఖికపరీక్షకే ప్రాధాన్య మీయబడి నది.

ఇందు మనకు వాడుకలో నుండి సులభముగ కంఠస్థ మగు కొన్ని స్తోత్రములు,బాలరామాయణమునందలి కొన్ని శ్లో

కములు, యక్షప్రశ్నలు, విదురనీతి నుండి మఱికొన్ని సుగమ శ్లోకములు, క్రమానుగతముగ నైదు సంస్కృతపాఠములు, కొన్ని శబ్దరూపములు పొందుపఱచితిమి. వీని నభ్యసించినచో తరువాతి పరీక్షలలో విద్యార్థులకు ప్రవేశము సుగమము కాగలదు. సంస్కృతభాషాకోవిదు లీ పాఠ్యప్రణాళికకు తగు ప్రచార మొసగి మా కృషికి చేయూత నిత్తురని విశ్వసించుచున్నాము. మాకీ యవకాశ మొసంగిన సంస్కృతభాషాప్రచారసమితి అధ్యక్షులు,సదస్యులకు మా ధన్యవాదములు.

పుల్లెల శ్రీరామచంద్రుడు
చలమచర్ల వేంకట శేషాచార్యులు

## సప్తదశ ముద్రణ పీఠిక

ప్రపంచంలో ఉన్న వేలకొలది భాషలలో సంస్కృతభాష అతి ప్రాచీనమైనది. సాహిత్యసౌందర్యదృష్టితో చూచినా, వాఙ్మయవైశాల్యదృష్టితో చూచినా, శబ్దసంపదదృష్టితో చూచినా, విషయవైవిధ్యదృష్టితో చూచినా దీనిని మించిన భాష మరొకటి లేదు. అందుచేతనే భారతీయులు దీనిని చూచి గర్వించాలి అని ఎందరో మేధావులు తమ అభిప్రాయం వ్యక్తంచేశారు.ఈ మహోత్తమభాషను అభ్యసించాలనే కోరిక ఉన్నా, చాలా మంది తమ కోరికను సఫలం చేసుకొనలేకుండా ఉన్నారు. చిన్నవారైనా,పెద్దవారైనా అట్టివారికి ఉపకరించే విధంగా సంస్కృతభా

షా ప్రచారసమితి, ఒక క్రమబద్ధమైన రీతిలో ఏడుపరీక్షలు నడు పుచున్నది. వీటిలో మొదటి నాలుగు పరీక్షలలోఉత్తీర్ణత సంపా దించినవారు కూడా రామాయణ భారతాలవంటి గ్రంథాలను చాలావరకు అర్థం చేసికొన గలుగుతారు.

సమితి నిర్వహించే పరీక్షలలో మొదటిదైన ప్రవేశిక ప రీక్షా పాఠ్యపుస్తకం పదహారు ముద్రణలలో ప్రచురించిన దా దాపు లక్షఎనభైరెండు వేల ప్రతులు ఎందరో సంస్కృతాధ్యేత లకు ఉపకరించినవి.ఇప్పుడు దీని పదునేడవ ముద్రణ చేయుచు అనతికాలంలో ఈ పుస్తకాలుకూడ సంస్కృత శ్రద్ధాళువుల హస్త ములను అలంకరించి హృదయములను అనందింప చేయగల వని విశ్వసించుచున్నాము.

**సాహిత్యశాస్త్ర శబ్దౌఘ సమృద్ధానన్దవర్ధనీ,**
**తవ మే తస్య భాషేయం గైర్వాణీ కిం న సేవ్యతే.**

పుల్లెల శ్రీరామచంద్రుడు
కులపతి



**సంస్కృతవాణీ**

**కేయూరాణి న భూషయన్తి పురుషం**

**హారా న చంద్రోజ్జ్వలాః**

**న స్నానం న విలేపనం న కుసుమం**

**నాలంకృతా మూర్ధజాః,**

**వాణ్యేకా సమలంకరోతి పురుషం**

**యా సంస్కృతా ధార్యతే**

**క్షీయంతేఽఖిలభూషణాని సతతం**

**వాగ్భూషణం భూషణమ్.**

- భర్తృహరి

**భావము**

భుజకీర్తులు కాని, చంద్రుని వలె ప్రకాశించు ముత్యాల సరులు కాని, స్నానము కాని, చందనాదులు కాని, అలంకృత ములైన కురులు కాని,మనుజుని అలంకరింపజాలవు. సంస్కృత మైన(దోషములు లేకుండునట్టి, శుద్ధమైన) మాటయే మనుజుని అలంకరించును.అలంకారములన్నియు నశించునే కాని నిలువ వు. సంస్కృతవాణి ఒక్కటే ఎల్లప్పుడు అలంకార మగును.



## విషయసూచికా





## సంస్కృతభారతీ ప్రవేశికా

## ప్రార్థనాశ్లోకాః

**వినాయక స్తుతిః**

**శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,**
**ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥ 1 ॥**

తెల్లని వస్త్రము ధరించినవాడును, సర్వవ్యాపియు, చంద్రునివలె తెల్లని రంగు గలవాడును, నాలుగు చేతులు కలవాడును, అనుగ్రహ సూచకమైన ముఖము కలవాడును అగు వినాయకుని, సకలవిఘ్నములు తొలగుటకు ధ్యానింపవలెను.

**అగజానన పద్మార్కం గజానన మహర్నిశమ్,**
**అనేకదం తం భక్తానామ్ ఏకదంత ముపాస్మహే ॥ 2 ॥**

పార్వతి ముఖమను పద్మమును వికసింపజేయు సూర్యుడును,భక్తులకుఅనేకవరములు ఇచ్చువాడును,ఒకే దంతము కలవాడును అగు గజముఖుని రేయింబవళ్ళు ధ్యానింతుము.

**హయగ్రీవ స్తుతిః**

**జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్,**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥ 3 ॥**

జ్ఞానస్వరూపుడును, ఆనందస్వరూపుడును, స్వచ్ఛమగు స్ఫటికమువలె తెల్లనిరూపము కలవాడును,అన్ని విద్యల కాధారమైనవాడును,భగవంతుడును అగు హయగ్రీవుని ధ్యానింతుము.

**గురు స్తుతిః**

**గురు ర్బ్రహ్మ గురుర్విష్ణుః గురు ర్దేవో మహేశ్వరః**

**గురుఃసాక్షాత్ పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥ 4 ॥**

గురువే బ్రహ్మదేవుడు, గురువే విష్ణువు,గురువే శివుడు, గురువే సాక్షాత్తు పరబ్రహ్మము. అట్టి శ్రీగురువునకు నమస్కారము.

**సచ్చిదానందరూపాయ వ్యాపినే పరమాత్మనే,**

**నమో వేదాంతవేద్యాయ గురవే బుద్ధిసాక్షిణే ॥ 5 ॥**

సచ్చిదానంద స్వరూపుడును, ఎల్లెడలను వ్యాపించువాడును, పరమాత్మయు, వేదాంతములచేతనే తెలియదగువాడును, బుద్ధికి సాక్షియు ఆగు గురువునకు నమస్కారము.

**అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా,**

**చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః. ॥ 6 ॥**

అజ్ఞానమను నేత్రవ్యాధిచే గ్రుడ్డియైనవాని నేత్రము, జ్ఞానమును కాటుక కడ్డీతో, ఎవ్వనిచే తెరువబడినదో ఆ శ్రీగురుదేవునకు నమస్కారము.

**దక్షిణామూర్తి స్తుతి:**

**గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్.**

**నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః ॥ 7 ॥**

అన్ని లోకములకు గురువైనవాడును,సంసారమను రోగముతో బాధపడువారికి వైద్యుడును,అన్ని విద్యలకు నిధియైనవాడును అగు దక్షిణామూర్తికి నమస్కారము.

**పరబ్రహ్మ స్తుతిః**

**అనంతనామధేయాయ సర్వాకారవిధాయినే,**

**సమస్తమంత్రవాచ్యాయ విశ్వైకపతయే నమః ॥ 8 ॥**

అసంఖ్యాకములగు పేర్లు కలవాడును, అన్ని రూపము లు ధరించువాడును,అన్నిమంత్రములచేతను చెప్పబడువాడును, ప్రపంచమునకు ఏకైకరక్షకుడును అగు పరబ్రహ్మకు వందనము.

**సరస్వతీ స్తుతిః**

**సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి,**

**విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ॥ 9 ॥**

వరముల నిచ్చుదానవు, ఇష్టమైన రూపము ధరించుదా నవు అగు ఓ సరస్వతీ! నీకు నమస్కారము. నేను చదువు మొ దలు పెట్టెదను. నా కెల్లప్పుడు కార్యసిద్ధి యగుగాక.

**పద్మపత్రవిశాలాక్షీ పద్మకేసరవర్ణినీ,**

**నిత్యం పద్మాలయా దేవీ సామాం పాతు సరస్వతీ॥10 ॥**

తామర రేకుల వలె విశాలములైన కన్నులు కలదియు, తామరపూవుయొక్క కింజల్కము (కేసరము)ల వర్ణమువంటి శరీరవర్ణము కలదియు, తామరలపై నివసించునదియు అగు సరస్వతీదేవి ఎల్లప్పుడు నన్ను కాపాడుగాక!

**శరదిందువికాసమందహాసాం**

**స్ఫురదిందీవర లోచనాభిరామామ్,**

**అరవిందసమాన సుందరాస్యామ్**

**అరవిందాసనసుందరీ ముపాసే ॥11॥**

శరత్కాలపు చంద్రునివలె తెల్లని వన్నెకల చిరునగవు కలదియు, ప్రకాశించు నల్లకలువల వంటి కన్నులతో సుందర

మైనదియు, పద్మముతో సాటియగు అందమైన మోము కలది యు, పద్మము పీఠముగా కల బ్రహ్మకు కాంతయు అగు సరస్వ తిని తలంతును.

**శ్రీకృష్ణ స్తుతిః**

**కస్తూరీతిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం**
**నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్,**
**సర్వాంగేహరిచందనంచకలయన్ కంఠేచ ముక్తావళీం**
**గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః ॥12 ॥**

విశాలమైన నుదుట కస్తూరితో తిలకమును, రొమ్ముపై కౌస్తుభ రత్నమును, ముక్కు కొనయందు క్రొత్త ముత్యమును, చేతిలో మురళిని,చేతులకు కంకణములను,శరీరమం దెల్లెడల పసుపువన్నెకల చందనమును,మెడలో ముత్యాలమాలను దాల్చి న గోపాలశ్రేష్ఠుడగు శ్రీకృష్ణుడు గోపికలు తన్ను చుట్టు ముట్టి నిలువగా, మిగుల విరాజిల్లుచున్నాడు.

**కరారవిందేన పదారవిందం**
**ముఖారవిందే వినివేశయంతమ్,**
**వటస్య పత్రస్య పుటే శయానం**
**బాలం ముకుందం మనసా స్మరామి ॥ 13 ॥**

పద్మమువంటి చేతితో, పద్మమువంటి పాదమును, పద్మమువంటి నోటిలో పెట్టుకొనుచు, మఱ్ఱియాకు దొన్నెపై శయనించిన బాలకృష్ణుని మదిలో ధ్యానింతును.

**శ్రీరామ స్తుతిః**

**శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం**

**సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపమ్,**

**ఆజానుబాహు మరవింద దళాయతాక్షం**

**రామం నిశాచర వినాశకరం నమామి ॥ 14 ॥**

రఘువంశమున పుట్టినవాడును, దశరథుని కుమారుడును, ఇట్టివాడని వర్ణింప శక్యము కానివాడును, సీతావల్లభుడును, రఘువంశ మను సముద్రమునకు చంద్రుడును, మోకాలి వఱకు పొడవగు చేతులు కలవాడును, తామరపూవు రేకులవలె విశాలమైన కన్నులు కలవాడును, రాక్షసులను చంపినవాడును అగు శ్రీరాముని నమస్కరింతును.

**ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్,**

**లోకాభిరామంశ్రీరామంభూయోభూయో నమామ్యహమ్॥15 ॥**

ఆపదలను పోగొట్టువాడును, సకలసంపదల నొసగువాడును, జనులెల్లరకు మనోహరుడును అగు శ్రీరాముని నేను మాటి మాటికి నమస్కరింతును.

**శ్రీరామచంద్రః శ్రితపారిజాతః**

**సమస్తకల్యాణ గుణాభిరామః,**

**సీతాముఖాంభోరుహ చంచరీకో**

**నిరంతరం మంగళ మాతనోతు ॥ 16 ॥**

తన్నాశ్రయించినవారికి కల్పవృక్షమైనవాడును, సకల శుభగుణములతో సంతోషింపజేయువాడును, సీతాదేవి ముఖము అను పద్మమునకు తుమ్మెదయైనవాడును అగు శ్రీరామ

చంద్రుడు ఎల్లపుడు శుభమును కలిగించుగాక.

**సీతా స్తుతిః**

**పుణ్యరాశిరివ మైథిలప్రభోః రామలోచన చకోరచంద్రికా,**

**దీపితార్చిరివరక్షసాంసదాజానకీ విజయతాం యశోధనా ॥17॥**

జనకుని పున్నెముల ప్రోవు,రాముని కన్నులు అను చకోరములకు వెన్నెల యైనట్టిది,రాక్షసులకు సదా ప్రజ్వలింప జేయబడిన అగ్నిజ్వాలయైనది, కీర్తియే ధనముగా కలదియు అగు సీత విజయమందుగాక!

**ఆంజనేయ స్తుతిః**

**బుద్ధిర్బలం యశో ధైర్యం నిర్భయత్వ మరోగతా,**

**అజాడ్యంవాక్పటుత్వంచ హనుమత్స్మరణాత్ భవేత్॥18॥**

హనుమంతుని ధ్యానించుటవలన బుద్ధి, బలము, కీర్తి, ధైర్యము, భయము లేకుండుట, రోగము లేకుండుట, మాంద్యము తొలగుట, చక్కగా మాటలాడగలుగుట సిద్ధించును.

**గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,**

**రామాయణమహామాలారత్నం వందేనిలాత్మజమ్॥ 19॥**

మహాసముద్రమును ఆవుకాలు మోపుటచే నేలపై నేర్పడిన గుంట(తో సమానము)గా చేసినవాడును,రాక్షసులను దోమలుగా చేసినవాడును,రామాయణ మను గొప్ప మణిమాలలో రత్నమైనవాడును,వాయు తనయుడును అగు ఆంజనేయుని నమస్కరింతును.

**మనోజవం మారుతతుల్యవేగం**

**జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,**

**వాతాత్మజం వానరయూథముఖ్యం**

**శ్రీరామదూతం శిరసా నమామి ॥ 20 ॥**

మనోవేగము, వాయువేగము కలవాడును, ఇంద్రియ ములను వశము చేసికొనినవాడును, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడును, వాయుదేవుని పుత్రుడును, వానరసైన్యములో ప్రధానుడును, శ్రీరాముని దూతయు అగు హనుమంతుని శిరము వంచి నమస్కరింతును.

**యత్ర యత్ర రఘునాథకీర్తనం**

**తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,**

**బాష్పవారి పరిపూర్ణ లోచనం**

**మారుతిం నమత రాక్షసాంతకమ్. ॥ 21 ॥**

ఎట నెట రామభజనము జరుగునో, అట నట శిరముపై నంజలి ఘటించి, ఆనందాశ్రువులు కనులు నిండగా నొప్పు రాక్షసనాశకుడగు ఆంజనేయునకు ప్రణమిల్లుడు.

**విష్ణు స్తుతిః**

**శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం**

**విశ్వకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్,**

**లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం**

**వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్॥ 22॥**

శాంతస్వరూపుడును, శేషశయనుడును, బొడ్డున తామరపూవు కలవాడును, దేవేశుడును, విశ్వరూపియు, ఆకాశ

మువలె సర్వవ్యాపియు, మేఘమువలె నల్లనివాడును, సుంద రాంగుడును, లక్ష్మీవల్లభుడును, పద్మపత్రములవంటి కన్నులు కలవాడును,యోగుల హృదయములందు ధ్యానముచే సాక్షాత్క రించువాడును, సంసారభయము తొలగించు వాడును, అన్ని లోకముల కధిపతియు అగు విష్ణువును నమస్కరింతును.

**లక్ష్మీ స్తుతిః**

**లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం**
**దాసీభూతసమస్త దేవవనితాం లోకైకదీపాంకురామ్,**
**శ్రీమన్మంద కటాక్షలబ్ధ విభవ బ్రహ్మేంద్ర గంగాధరాం**
**త్వాంత్రైలోక్యకుటుంబినీంసరసిజాంవన్దేముకున్దప్రియామ్23**

పాల్కడలి పట్టివి, శ్రీరంగనాథస్వామి నాయికవు, సమ స్తదేవకాంతలు దాసీజనముగా కలదానవు, లోకముల కేకైక దీపకళికవు, శ్రీమంతమగు నొకింత కటాక్షముచేతనే బ్రహ్మను, ఇంద్రుని,శివుని వైభవోపేతుల నొనర్చినదానవు, ముల్లోకము లు కుటుంబముగా కలదానవు, సరోజాతవు, విష్ణు ప్రియవు అగు ఓ లక్ష్మీ! నీకు నమస్కారము.

**శివ స్తుతిః**

**చంద్రాననార్ధదేహాయ చంద్రాంశుసితమూర్తయే,**
**చంద్రార్కానలనేత్రాయ చంద్రార్ధశిరసే నమః ॥ 24 ॥**

చంద్రునివంటిమోముగల పార్వతి సగము శరీరముగా కలవాడును, చంద్రకిరణములవలె తెల్లని యాకృతి కలవాడును, చంద్రుడు-సూర్యుడు-అగ్ని మూడు కన్నులుగ కలవాడును,తల-

పై చంద్రకళ కలవాడును అగు శివునకు నమస్కారము.

**పార్వతీ స్తుతిః**

**మృణాళవ్యాళవలయా వేణీబంధకపర్దినీ,**

**హరానుకారిణీ పాతు లీలయా పార్వతీ జగత్ ॥ 25 ॥**

తామరతూండ్లు అనెడు నాగకంకణములును, జుట్టుము డి యనెడు జటాజూటమును కలదై శివుని అనుకరించుచున్న పార్వతి, తన విలాసముతో లోకమును కాపాడుగాక.

**శివపార్వతీ స్తుతిః**

**వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే,**

**జగతః పితరౌ వందే పార్వతీప రమేశ్వరౌ ॥ 26 ॥**

శబ్దార్థములవలె కలసియున్నవారు, లోకములకు తల్లి దండ్రులు అగు పార్వతీపరమేశ్వరులను(శివకేశవులను) శబ్దార్థ జ్ఞానము కొఱకు నమస్కరింతును.(శ్లేషాలంకారము)

**నృసింహ స్తుతిః :**

**ఏకేన శంఖ మపరేణ కరేణ చక్ర**

**మన్యేన సింధుతనయా మవలంబ్య తిష్ఠన్,**

**వామేతరేణ వరదాభయహస్తముద్రాం**

**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 27 ॥**

నాలుగు చేతులలో నొకదానిచే శంఖమును, వేరొక దానిచే చక్రమును, మరియొకదానిచే లక్ష్మీదేవిని, కుడిచేతితో వరముల నొసగెడి అభయ ముద్రను దాల్చి నిలచిన శ్రీలక్ష్మీనృ సింహా! నాకు నీ చేయూత నిమ్ము.

**సూర్య స్తుతిః :**

**చక్షుషే జగతాం తేజోనిధయే కర్మసాక్షిణే,**

**మూర్తిత్రయస్వరూపాయ మార్తాండాయ నమోనమః ॥ 28 ॥**

లోకములకు కన్ను, వెలుగులకు నిధి, జీవులు చేయు శుభా శుభ కర్మలకు సాక్షి, బ్రహ్మ విష్ణు శివాత్మకుడు అగు సూర్యున కు ప్రణామము.



## బాలరామాయణమ్

**విఘ్నేశ్వర ధ్యానమ్**

**శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,**
**ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥ 1 ॥**

తెల్లని వస్త్రము ధరించినవాడును, సర్వవ్యాపియు, చంద్రునివలె తెల్లని రంగు కలవాడును, నాలుగు చేతులు కలవాడును, అనుగ్రహ సూచకమైన ముఖము కలవాడును అగు వినాయకుని, సకలవిఘ్నములు తొలగుటకు ధ్యానింపవలెను.

**శ్రీరామ ధ్యానమ్**

**రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,**
**రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః॥2 ॥**

రామభద్రుడు, రామచంద్రుడు, రఘునాథు డను నామములతో ప్రసిద్ధుడును, లోకములకు ప్రభువును, సీతాపతియు, పరబ్రహ్మ స్వరూపుడును అగు శ్రీరామునకు నమస్కారము.

**వాల్మీకి ధ్యానమ్**

**కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,**
**ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకి కోకిలమ్ ॥ 3 ॥**

కవిత్వ మను కొమ్మనెక్కి 'రామ' 'రామ' అను తీయని పలుకులను కమ్మగా పలుకుచున్న వాల్మీకి అను కోకిలకు నమస్కరింతును.

**ఆంజనేయ ధ్యానమ్**

**అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,**

**కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్ ॥ 4 ॥**

వీరుడును, సీతాదేవి దుఃఖము తొలగించినవాడును, కపి ముఖ్యుడును, అక్షరాక్షసుని సంహరించినవాడును, లంకా నగరమునకు భయము కలిగించినవాడును అగు ఆంజనేయు నకు నమస్కరింతును.

**శ్రీరామప్రశంసా**

**వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,**

**వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా॥5 ॥**

వేదములచే తెలిసికొనదగిన పరమపురుషుడు దశరథు ని కుమారుడై ఆవిర్భవింపగా వేదము వాల్మీకి ముఖమునుండి సాక్షాత్తుగ రామాయణ స్వరూపముతో వెలసినది.

**పారాయణ శ్రవణ ఫలమ్ :**

**యః కర్ణాంజలిసంపుటై రహ రహ స్సమ్యక్ పిబత్యాదరాత్**

**వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు,**

**జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యంత,సోపద్రవం**

**సంసారంసవిహాయగచ్ఛతిపుమాన్ విష్ణోః పదంశాశ్వతమ్॥ 6 ॥**

వాల్మీకియొక్క ముఖపద్మమునుండి వెలువడిన రామా యణ మను పేరు కల మకరందము నెవడు చెవులు అను దోసి ళ్లతో ప్రతిదినము ఆదరముతో చక్కగ త్రాగునో,అతడు పుట్టుక-రోగము-ముసలితనము-చావు అను వీనిచే మిక్కిలి క్లేశకర మగు సంసారమును వీడి శాశ్వతమగు వైకుంఠమున కేగును.

**తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,**

**నారదం పరిపప్రచ్ఛవాల్మీకి ర్మునిపుంగవమ్॥ 1 ॥**

తపస్సంపన్నుడగు వాల్మీకి, తపోవేదాధ్యయనము లందు మిక్కిలి ఆసక్తి కలవాడును, బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడును, మునులలో ఉత్తముడును అగు నారదుని ఈవిధముగా వాల్మీకి ప్రశ్నించెను.

**కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్,**

**ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః ॥ ౨ ॥**

ఈ భూలోకమున మంచి గుణములు కలవాడు, పరాక్రమశాలి, ధర్మ మెఱిగినవాడు, తన కితరులు చేసిన మేలు మఱువక తెలిసియుండువాడు, నిజము పలుకువాడు, ఫలించు వఱకు పని కొనసాగించు పట్టుదల కలవాడును ఎవడు?

**చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః,**

**విద్వాన్ కః క స్సమర్థశ్చ కశ్చైకప్రియదర్శనః॥ 3 ॥**

తన ధర్మము వీడని వాడెవడు? అన్ని ప్రాణులకు మేలు చేయువాడెవడు? అన్ని విషయముల నెఱిగి, నిపుణుడైన వాడెవడు? ఎల్లపుడు జనులు నానందింపజేయు దర్శనము కలవాడెవడు?

**ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కోఽనసూయకః,**

**కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే ॥ 4 ॥**

ధైర్యము కలవాడును, కోపమును జయించినవాడును,

తేజస్వియైనవాడును ఎవడు? ఇతరులలో తప్పులు వెదకు స్వభావము (అసూయ) లేనివా డెవడు? యుద్ధమున కోపిం చిన ఏ మహాపురుషునకు దేవతలు కూడ భయపడుదురు?

**ఏత దిచ్ఛా మ్యహం శ్రోతుం పరం కౌతూహలం హి మే**

**మహర్షి త్వం సమర్థోసి జ్ఞాతుమేవంవిధం నరమ్॥ 5 ॥**

నే నీ గుణములు కలవా డెవ్వడో తెలియగోరుచున్నాను. నా కీ విషయమున నెంతో యభిలాష కలుగుచున్నది. ఓ నారదమహర్షీ! ఇట్టి మనుజు డెవడో తెలిసికొనుటకు నీవే సమర్థుడవు.

**శ్రుత్వా చైతత్ త్రిలోకజ్ఞో వాల్మీకే ర్నారదో వచః,**

**శ్రూయతామితి చామంత్ర్య ప్రహృష్టో వాక్యమబ్రవీత్॥ 6 ॥**

ముల్లోకములందలి విషయములు అన్నియు ఎఱిగిన నారదుడు వాల్మీకి మాట నాలకించి, ఇదిగో వినుమని యాత ని తన కభిముఖునిగ చేసికొని ఆనందముతో నిట్లు పలికెను.

**బహవో దుర్లభాశ్చైవ యే త్వయా కీర్తితా గుణాః,**

**మునేవక్ష్యామ్యహంబుద్ధ్వా తైర్యుక్తఃశ్రూయతాంనరః॥7॥**

ఓ మునీ!నీవు వర్ణించిన అనేకగుణము లందఱిలో కని పింపవు. అట్టి గుణములు కలవానిని నే నెఱుగుదును. ఆ నరు డెవ్వడో వినుము.

**ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః,**

**నియతాత్మామహావీర్యోద్యుతిమాన్ ధృతిమాన్ వశీ॥8॥**

అత డిక్ష్వాకువంశమున పుట్టినాడు. రాముడని జనుల లో ప్రసిద్ధి పొంది యున్నాడు. అతని మనస్సు నిలుకడ కలది. పరాక్రమము గొప్పది. అతడు తేజశ్శాలి, ధైర్యవంతుడు, ఇంద్రి యనిగ్రహము కలవాడు.

**బుద్ధిమాన్ నీతిమాన్ వాగ్మీ శ్రీమాన్ శత్రునిబర్హణః,**

**విపులాంసో మహాబాహుః కంబుగ్రీవో మహాహనుః ॥ 9 ॥**

ఆ రాముడు మిక్కిలి బుద్ధిమంతుడు. నీతి నెఱిగినవాడు. చక్కగా మాటలాడు నేర్పు కలవాడు. ఐశ్వర్యసంపన్నుడు. శత్రు వులను నాశనము చేయువాడు. విశాలమైన మూపు కలవాడు. గొప్ప భుజములు కలవాడు. శంఖమువంటి మెడ కలవాడు. గొప్ప కపోలముల పైభాగము కలవాడు.

**మహోరస్కో మహేష్వాసో గూఢజత్రురరిందమః,**

**ఆజానుబాహుః సుశిరాః సులలాటః సువిక్రమః ॥ 10 ॥**

విశాలమైన వక్షఃస్థలము కలవాడు, గొప్ప విల్లు కలవా డు. బలిష్ఠుడగుటచే కనపడని జత్రువులు (మూపు సంధి యెము కలు) కలవాడు, శత్రువుల నణచు వాడు, మోకాళ్ళవఱకు విస్త రించిన భుజములు కలవాడు, చక్కని తల, నుదురు కలవాడు, గొప్ప పరాక్రమము కలవాడు.

**సమః సమవిభక్తాంగః స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్,**

**పీనవక్షా విశాలాక్షో లక్ష్మీవాన్ శుభలక్షణః ॥ 11 ॥**

సకలజీవులందు సమభావన కలవాడు, సమముగ ను న్న అవయవములు కలవాడు, నిగనిగలాడు శరీరవర్ణము కల

వాడు, పరాక్రమవంతుడు, బలిసిన బొమ్మ కలవాడు, విశాల ములైన కన్నులు కలవాడు, శోభాసమన్వితుడు, ఉత్తమ లక్షణ ములు కలవాడు.

**ధర్మజ్ఞః సత్యసంధశ్చ ప్రజానాం చ హితే రతః,**
**యశస్వీ జ్ఞానసంపన్నఃశుచి ర్వశ్యః సమాధిమాన్॥12 ॥**

రాముడు ధర్మ మెఱిగినవాడు, సత్యప్రతిజ్ఞ కలవాడు, ప్రజలకు మేలుకలిగించుటలో నాసక్తుడు,కీర్తిమంతుడు,జ్ఞానము కలవాడు, పరిశుద్ధుడు, భక్తవశుడు, ఆశ్రితపరిపాలన మను నియమము కలవాడు.

**ప్రజాపతిసమః శ్రీమాన్ ధాతా రిపునిషూదనః,**
**రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా ॥ 13 ॥**

ఆ రాముడు బ్రహ్మతో సమానుడు. ఐశ్వర్యసంపన్నుడు, ప్రజా పోషకుడు,శత్రుసంహార మొనర్చువాడు. సకలప్రాణులను రక్షించువాడు, ధర్మమును కాపాడువాడు.

**రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా,**
**వేదవేదాంగతత్త్వజ్ఞో ధనుర్వేదే చ నిష్ఠితః ॥ 14 ॥**

అతడు తన ధర్మమును, తనవారిని చక్కగా కాపాడు వాడు, వేద-వేదాంగముల స్వరూప మెఱిగినవాడు, ధనుర్వే దమున (విలువిద్యలో) కుశలుడు.

**సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్,**
**సర్వలోకప్రియః సాధు రదీనాత్మా విచక్షణః ॥ 15 ॥**

సకలశాస్త్రముల పరమార్థ మెఱిగినవాడు, తెలిసిన ఆ

పరమార్థమును విస్మరింపనివాడు, ప్రతిభ కలవాడు, అందఱకు ప్రీతిపాత్రుడు.మంచిపనుల నాచరించువాడు,దైన్యము నొందని వాడు, అన్ని పనులలో కుశలుడు.

**సర్వదాభిగత స్సద్భిస్సముద్ర ఇవ సింధుభిః,**

**ఆర్యః సర్వసమశ్చైవ సదైకప్రియదర్శనః ॥ 16 ॥**

నదులచే సముద్రమువలె ఎల్లప్పుడు సజ్జనులచే సేవింప బడువాడు, పూజ్యుడు, ఎల్లరియందు (శత్రు, మిత్ర, ఉదాసీను లయందు)సమబుద్ధి కలవాడు, ఎల్లప్పుడు అనురాగయుక్తమగు దర్శనమే కలవాడు.

**స చ సర్వగుణోపేతః కౌసల్యానందవర్ధనః,**

**సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవానివ** ॥ 17 ॥

ఆత డన్ని సుగుణముల కాలవాలము. కౌసల్య ఆనంద మును పెంపొందించువాడు, లోతైన యాలోచనలో సముద్రు నంతటివాడు, ధైర్యమున హిమవంతునివలె చలింపనివాడు.

**విష్ణునా సదృశో వీర్యే సోమవత్ ప్రియదర్శనః,**

**కాలాగ్నిసదృశః క్రోధే క్షమయా పృథివీసమః,**

**ధనదేన సమస్త్యాగే సత్యేధర్మ ఇవాపరః ॥ 18 ॥**

ఆ రాముడు పరాక్రమమున విష్ణువుతో సమానుడు, చంద్రునివలె ఆహ్లాదము కలిగించు దర్శనము కలవాడు, కోప మున ప్రళయాగ్నితో సమానుడు. సహనమున భూమితో సమా నుడు.దానమున కుబేరునితో సమానుడు.సత్యము పలుకుట లో అపరధర్మదేవతయే.

★★★

## యక్షప్రశ్నాః

**ప్రశ్నః**

**కింస్విత్ గురుతరం భూమేః కింస్వి దుచ్చతరం చ ఖాత్,**

**కింస్విత్ శీఘ్రతరంవాయోఃకింస్విద్ బహుతరం తృణాత్॥1॥**

భూమికంటె బరువేది?ఆకాశము కన్న నున్నతమేది? గాలి కన్న వేగము కలదేది?గడ్డికన్నను ఎక్కువగ కనబడునది ఏది?

**ఉత్తరమ్:**

**మాతా గురుతరా భూమే ఖాత్ పితోచ్చతర స్తథా,**

**మనః శీఘ్రతరంవాతాత్ చింతాబహుతరీ తృణాత్॥ 2 ॥**

తల్లి భూమికంటె బరువైనది (గొప్పది). తండ్రి యాకాశ మునకంటె నున్నతుడు.మనసు గాలికంటె వేగము కలది. చింత గడ్డికంటెను ఎక్కువగా అంతటను కనబడునది (చింత అనగా మానసిక క్లేశము.)

**ప్రశ్నః :**

**కింస్విత్ ప్రవసతో మిత్రం కింస్విత్ మిత్రం గృహే సతః,**

**ఆతురస్య చ కింమిత్రం కింస్విత్ మిత్రం మరిష్యతః॥ 3 ॥**

దూరదేశమున నున్నవానికి మిత్రు డెవరు? ఇంటిలో నున్నవానికి మిత్రు డెవరు? రోగికి మిత్రు డెవరు? చావనున్న వానికి మిత్రు డెవరు?

**ఉత్తరమ్:**

**సార్థః ప్రవసతో మిత్రం భార్యా మిత్రం గృహే సతః,**

**ఆతురస్య భిషక్ మిత్రం దానం మిత్రం మరిష్యతః ॥4 ॥**

దూరదేశమం దున్నవానికి అట్లు దూరదేశమందున్న వారి (ప్రవాసుల) గుంపు మిత్రుడగును. గృహస్థునకు భార్యయే మిత్రము. రోగికి వైద్యుడే మిత్రుడు. చావనున్నవానికి దానమే మిత్రుడు.

**ప్రశ్నః :**

**కిం జ్ఞానం ప్రోచ్యతే రాజన్ కః శమశ్చ ప్రకీర్తితః,**

**దయాచ కాపరాప్రోక్తా కించార్జవ ముదాహృతమ్॥ 5 ॥**

రాజా! జ్ఞాన మనగా నేమి?శమ మనగా నేమి? దయ యనగా నేమి? ఆర్జవ మనగా నేమి ?

**ఉత్తరమ్ :**

**జ్ఞానం తత్త్వార్థసంబోధః శమశ్చిత్తప్రశాంతతా,**

**దయా సర్వసుఖైషిత్వ మార్జవం సమచిత్తతా ॥ 6 ॥**

పరమార్థము నెఱుగుటయే జ్ఞానము. చిత్తము ప్రశాంతముగా ఉండుటయే శమము. సకలజీవులకు సుఖము, కలుగవలెనని కోరుటే దయ.అందరియెడల(లేదా సర్వకాలముల లో)ఒక్కతీరుగనే ప్రవర్తించు చిత్తముకలిగియుండుట ఆర్జవము.



## **విదురనీతిః**

**బుద్ధ్యా భయం ప్రణుదతి తపసా విందతే మహః,**

**గురుశుశ్రూషయా జ్ఞానం శాంతిం యోగేన విందతి ॥ 1 ॥**

వివేకముచే భయము పోగొట్టుకొనును. తపస్సుచే తేజస్సు నందును. గురుసేవచే జ్ఞానము సంపాదించును. మనో నిగ్రహ ముచే శాంతి నందును.

**ఏకో ధర్మః పరం శ్రేయః క్షమైకా శాంతి రుత్తమా,**

**విద్యైకా పరమా తృప్తి రహింసైకా సుఖావహా ॥ 2 ॥**

ధర్మ మొక్కటే ఉత్తమశ్రేయము. ఓర్పు ఒక్కటే ఉత్తమ శాంతి. విద్య యొక్కటే గొప్ప తృప్తి. అహింస యొక్కటే సుఖప్ర దము.

**షడేవ తు గుణాః పుంసా న హాతవ్యాః కదాచన,**

**సత్యందాన మనాలస్య మనసూయా క్షమా ధృతిః ॥ 3 ॥**

మనుజు డెన్నటికి విడువరాని గుణము లాఱు. అవి సత్యము, దానము, సోమరితనము లేకుండుట, అసూయ లేకుండుట, ఓర్పు, ధైర్యమును.

**అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః,**

**చత్వారి సంప్రవర్ధంతే విద్యాచాయు ర్యశో బలమ్॥ 4 ॥**

పూజ్యులను నమస్కరించు స్వభావము కలిగి, పెద్దల నెల్లపుడు సేవించు వానికి విద్య, ఆయువు, యశస్సు, బలము ఈ నాలుగు వృద్ధినందును.

**త్రివిధం నరక స్యేదం ద్వారం నాశనమాత్మనః,**

**కామః క్రోధ స్తథా లోభఃతస్మాదేతత్రయం త్యజేత్॥ 5 ॥**

కామము,క్రోధము,లోభము అను నీ మూడు ఆత్మవినాశము కలిగించు మూడువిధములైన నరకద్వారములు. కాన వీనిని విడువవలెను.

**యథా మధు సమాదత్తే రక్షన్ పుష్పాణి షట్పదః,**

**తద్వదర్థాన్ మనుష్యేభ్య ఆదద్యా దవిహింసయా ॥ 6 ॥**

పూలు కందకుండ తుమ్మెద తేనె త్రాగునట్లు, (రాజు) మనుజులను వేధించకయే వారి నుండి ధనమును (పన్నులను) తీసికొనవలెను.

**యస్య కృత్యం న జానన్తి మంత్రం వా మంత్రితం పరే,**

**కృత మే వాస్య జానన్తి స వై పణ్డిత ఉచ్యతే ॥ 7 ॥**

అతడేమి చేయునో యెవ్వరు నెఱుగరు. చేసిన ఊహ యేమో తెలియరాదు. ముగిసిన పనిని మాత్రమే ఇతరులు ఎరుగుదురు. అట్టివానినే పండితుడందురు.



## ప్రథమః పాఠః

### పదపరిచయః

| **పుంలింగాః** | **స్త్రీలింగాః** |
| --- | --- |
| రామః = రాముడు | సీతా = సీత |
| దేవః = దేవుడు | దేవతా = దేవత |
| బాలః = బాలుడు | బాలికా = బాలిక |
| గజః = ఏనుగు | మాలా = దండ |
| హరిః = విష్ణువు | లతా = తీగ |
| అగ్నిః = నిప్పు | **నపుంసకలింగాః** |
| గురుః = ఉపాధ్యాయుడు | పుస్తకమ్ = పుస్తకము |
| శంభుః = శివుడు | పాత్రమ్=గిన్నె |
| సోదరః =తమ్ముడు/అన్న | నేత్రమ్=కన్ను |
| తాతః = తండ్రి | ధనమ్=డబ్బు |
| **'ఇదం'శబ్దరూపాణి** | **కిం' శబ్దరూపాణి** |
| అయమ్ (పుం)=ఇతడు, ఇది | కః (పుం) = ఎవడు, ఏది |
| ఇయమ్ (స్త్రీ) = ఈమె, ఇది | కా (స్త్రీ) = ఎవతె, ఏది |
| ఇదమ్ (నపుం)=ఇది | కిమ్ (నపుం) = ఏది |

### వాక్యప్రయోగః

| | |
| --- | --- |
| అయం రామః | అయం గజః. |
| అయం కః? | అయం కః ? |
| అయ రామః | అయం గజః. |

| | |
|---|---|
| ఇయం సీతా. | ఇయం లతా. |
| ఇయం కా? | ఇయం కా? |
| ఇయం సీతా | ఇయం లతా |
| | |
| ఇదం పుస్తకమ్ | ఇదం నేత్రమ్. |
| ఇదం కిమ్? | ఇదం కిమ్ |
| ఇదం పుస్తకమ్. | ఇదం నేత్రమ్ |

**అభ్యాసః**

**1. ఈ క్రింది పదముల నుపయోగించి 'ఇదం' శబ్దరూపములతో వాక్యములు చెప్పుము.**

1. బాలికా 2. దేవః 3. నేత్రమ్ 4. గురుః 5. ధనమ్ 6. మాలా 7. దేవతా 8. లతా 9. పాత్రమ్ 10. హరిః

**2. ఈ క్రింది సమాధానము వచ్చునట్లు ప్రశ్నింపుము.**

1. అయం బాలః 2. ఇయం లతా. 3. ఇదం ధనమ్.

**3. తగిన పదములతో వాక్యములు పూరించుము.**

1. అయం--- 2. ఇయం --- 3. ఇదం ---

**4.ఈ క్రింది ప్రశ్నలకు సమాధానము లిమ్ము?**

1. అయం కః? 2. ఇయం కా? 3. ఇదం కిమ్ ?



## ద్వితీయః పాఠః

### పదపరిచయః

| **పుంలింగాః** | **స్త్రీలింగాః** |
|---|---|
| చంద్రః = చంద్రుడు | వీణా= వీణ |
| అహారః = ఆహారము | ఘంటా= గంట |
| ధనికః-డబ్బు కలవాడు | ధేనుః = ఆవు |
| సముద్రః=సముద్రము | నది=నది. |
| విద్యాలయః= పాఠశాల | **నపుంసకలింగాః** |
| రవిః = సూర్యుడు | నక్షత్రమ్-నక్షత్రము |
| కాకః= కాకి | పుష్పమ్-పూవు |
| పితా = తండ్రి | ఫలమ్ పండు |
| **'తద్' శబ్దరూపాణి** | **ఏతద్' శబ్దరూపాణి** |
| సః (పుం)-వాడు, అది | ఏషః (పుం)-వీడు, ఇది |
| సా (స్త్రీ) = ఆమె, అది | ఏషా (స్త్రీ)-ఈమె, ఇది |
| తత్ (నపుం)-అది | ఏతత్ (నపుం) - ఇది |

### వాక్యప్రయోగః

| | | |
|---|---|---|
| సః చంద్రః | సా వీణా | తత్ నక్షత్రమ్. |
| సః కః? | ఏషా కా? | తత్ కిమ్ ? |
| సః చంద్రః | సా వీణా | తత్ నక్షత్రమ్ |
| ఏషః కాకః | ఏషా ధేనుః | ఏతత్ పుష్పమ్ |
| ఏషః కః ? | సా కా? | ఏతత్ కిమ్ ? |
| ఏషః కాకః | ఏషా ధేనుః | ఏతత్ పుష్పమ్. |

## అభ్యాసః

**1. 'తద్' శబ్దరూపములతో వాక్యములు పూరింపుము.**

1.---- సముద్రః 3.---- ఫలమ్

2.---- నదీ. 4.----ధేనుః.

**2.'ఏతద్'శబ్దరూపములతో వాక్యములు పూరించుము.**

1. ---- ధనికః 3.----పుస్తకమ్.

2.---- ఘంటా. 4.----వీణా.

**3.ఈ క్రింది సమాధానము వచ్చుట కెట్టి ప్రశ్న వేయవలెనో తెలుపుము.**

1. సః గజః. 4. ఏషః కాకః

2. సా దేవతా. 5. ఏషా లతా.

3. తత్ ధనమ్. 6. ఏతత్ నేత్రమ్.

**4. తగిన పదములతో వాక్యములు పూరించుము.**

1. ఏషా---- 4. తత్----

2. ఏతత్---- 5.సా -----

3. ఏషః ---- 6. సః ---



## తృతీయః పాఠః

### పదపరిచయః (బహువచనరూపాణి)

| **పుంలింగాః** | **స్త్రీలింగాః** |
|---|---|
| రామాః= రాములు | దేవతాః=దేవతలు |
| దేవాః=దేవులు | బాలికాః=బాలికలు |
| బాలాః= బాలురు | మాలాః= దండలు |
| గజాః= ఏనుగులు | లతాః=తీగలు |
| సముద్రాః= సముద్రములు | వీణాః = వీణలు |
| విద్యాలయాః= పాఠశాలలు | ఘంటాః= గంటలు |
| కాకాః=కాకులు | సీతాః-సీతలు |

**నపుంసకలింగాః**

పుస్తకాని= పుస్తకములు

పాత్రాణి=గిన్నెలు

నేత్రాణి= కన్నులు

ధనాని=ధనములు

నక్షత్రాణి = నక్షత్రములు

పుష్పాణి= పూవులు

ఫలాని=పండ్లు

| **'తద్' శబ్దరూపాణి** | **'ఇదమ్' శబ్దరూపాణి** |
|---|---|
| తే(పుం) = వారు, అవి | ఇమే (పుం) = వీరు, |
| తాః (స్త్రీ) = వారు, అవి | ఇమాః (స్త్రీ)= వీరు ఇవి |

తాని (నపుం) = అవి ఇమాని (నపుం) = ఇవి

**కిం' శబ్దరూపాణి** **'ఏతద్' శబ్దరూపాణి**

కే (పుం) = ఎవరు? ఏవి? ఏతే (పుం) = వీరు, ఇవి

కాః (స్త్రీ) = ఎవరు? ఏవి? ఏతాః (స్త్రీ) = వీరు, ఇవి

కాని (నపుం) = ఏమి? ఏతాని (నపుం) = ఇవి

**వాక్యప్రయోగః**

ఇమే దేవాః ఇమాః బాలికాః ఇమాని పుస్తకాని

ఇమే కే? ఇమాః కాః? ఇమాని కాని?

ఇమే దేవాః ఇమాః బాలికాః ఇమాని పుస్తకాని

తే గజాః. తాః మాలాః తాని పాత్రాణి

తే కే? తాః కాః? తాని కాని?

తే గజాః తాః మాలాః తాని పాత్రాణి

ఏతే కాకాః ఏతాః లతాః ఏతాని పుష్పాణి

ఏతే కే? ఏతాః కాః? ఏతాని కాని?

ఏతే కాకాః ఏతాః లతాః ఏతాని పుష్పాణి.

**అభ్యాసః**

**1.'ఇదం' శబ్దరూపములతో వాక్యములు పూరించుము.**

1. -- ధనికాః 2. వీణాః -------3. ---- ఫలాని.

**2. 'తద్' శబ్దరూపములతో వాక్యములు పూరించుము.**

1.----సముద్రాః 2.---- ఘంటాః. 3. ---- నక్షత్రాణి.

**3.'ఏతద్' శబ్దరూపములతో వాక్యములు పూరించుము.**

1.---- కాకాః. ౨.----లతాః. 3. ---- పుష్పాణి.

**4. ఈ క్రింది ప్రశ్నలకు సమాధానమిమ్ము.**

1. అయం కః?　　౨. ఇయం కా?　　3. ఇదం కిమ్ ?

4. ఇమే కే?　　5. ఇమాః కాః?　　6. ఇమాని కాని?

౭. సః కః?　　8. సా కా?　　౯. తత్ కిమ్ ?

10. తే కే?　　11. తాః కాః?　　1౨. తాని కాని?

13. ఏషః కః?　　14. ఏషా కా?　　15. ఏతత్ కిమ్ ?

16. ఏతే కే?　　17. ఏతాః కాః?　　18. ఏతాని కాని?

**5. తగిన పదములతో వాక్యములు పూరించుము.**

1.ఇయం ---　　౨. తే ---　　3. ఏషః --

4.తాని ---　　5. అయం ---　　6. సః ---

౭.ఏషా ---　　8.తాః ---　　౯. ఇమాని ---

10.ఇదం---　　11. ఏతత్ ---　　1౨. సా ---

**6.క్రింది వాక్యములను ఏకవచనములోనికి మార్చుము.**

1. ఇమే దేవాః　　౨. ఇమాః బాలికాః　　3.ఇమానిపుస్తకాని

4. తే గజాః　　5. తాః మాలాః　　6. తాని పాత్రాణి

౭. ఏతే కాకాః　　8. ఏతాః లతాః　　౯.ఏతాని పుష్పాణి



## చతుర్థః పాఠః

### పదపరిచయః

త్వమ్ = నీవు
అహమ్ = నేను
యూయమ్ = మీరు
వయమ్ = మేము
యువకః =యువకుడు
యువకాః= యువకులు
ఉపాధ్యాయః = గురువు
ఉపాధ్యాయాః = గురువులు
శిష్యః = శిష్యుడు
శిష్యాః = శిష్యులు
అంబా = తల్లి
అంబాః = తల్లులు
మిత్రమ్ = చెలికాడు
మిత్రాణి = చెలికాండ్రు
కలత్రమ్ = భార్య
కలత్రాణి = భార్యలు
భవాన్ = నీవు,
భవంతః = మీరు (తమరు)

### వాక్యప్రయోగః

త్వం బాలః.
యూయం బాలాః.
అహం కః?
వయం కే?
త్వం బాలః.
యూయం బాలాః.

అహం యువకః
వయం యువకాః
త్వం కః?.
యూయం కే?
అహం యువకః
వయం యువకాః

త్వం శిష్యః.?
యూయం శిష్యాః
అహం కః?
వయం కే

| | |
|---|---|
| త్వం శిష్యః | యూయం శిష్యాః |
| | |
| అహం ఉపాధ్యాయః | వయం ఉపాధ్యాయాః. |
| భవాన్ కః? | భవన్తః కే? |
| అహం ఉపాధ్యాయః | వయం ఉపాధ్యాయాః |
| | |
| త్వం బాలికా | యూయం బాలికాః. |
| అహం కా? | వయం కాః? |
| త్వం బాలికా | యూయం బాలికాః. |
| | |
| త్వం మిత్రమ్. | యూయం మిత్రాణి |
| అహం కిమ్ ? | వయం కాని? |
| త్వం మిత్రమ్. | యూయం మిత్రాణి |
| | |
| అహం కలత్రమ్. | వయం కలత్రాణి. |
| త్వం కిమ్? | యూయం కాని? |
| అహం కలత్రమ్ | వయం కలత్రాణి. |
| | |
| అహం అంబా | వయం అంబాః |
| త్వం కా? | యూయం కాః? |
| అహం అంబా | వయం అంబాః |

**అభ్యాసః**

**1. ఈ క్రింది ప్రశ్నలకు సమాధాన మిమ్ము.**

1. త్వం కః?  2. త్వం కా?

3. త్వం కిమ్ ?  4. అహం కః?

5. అహం కా?  6. అహం కిమ్?

7. యూయం కే?  8. యూయం కాః?

9యూయం కాని?  10. వయం కే?

11. వయం కాః ?  12. వయం కాని?

**2.ఈ క్రింది వాక్యములను బహువచనములోనికి మార్చుము**

1. అహం బాలః  2. అహం దేవః

3. త్వం బాలా  4. త్వం లతా

5. అహం కలత్రమ్  6. త్వం మిత్రమ్

**3.ఈ క్రింది వాక్యములను ఏకవచనములోనికి మార్చుము.**

1. వయం ఉపాధ్యాయాః.  2. యూయం బాలికాః.

3. వయం దేవాః.  4. యూయం నరాః



## పంచమః పాఠః

## క్రియాపదపరిచయః

| | | | |
|---|---|---|---|
| గచ్ఛతి=పోవు | చున్నాడు/చున్నది | గచ్ఛన్తి=పోవు | చున్నారు/చున్నవి |
| ధావతి= పరుగెత్తు | ” | ధావన్తి=పరుగెత్తు | ” |
| వదతి=చెప్పు | ” | వదన్తి= చెప్పు | ” |
| పఠతి=చదువు | ” | పఠన్తి= చదువు | ” |
| ఖాదతి=తిను | ” | ఖాదన్తి=తిను | ” |
| పిబతి=త్రాగు | ” | పతతి=పడు | ” |
| పిబన్తి=త్రాగు | ” | పతన్తి=పడు | ” |
| నమతి=నమస్కరించు | ” | నమన్తి=నమస్కరించు | ” |
| వికసతి=వికసించు | ” | వికసన్తి=వికసించు | ” |
| పశ్యతి=చూచు | ” | పశ్యన్తి=చూచు | ” |
| కరోతి=చేయు | ” | కుర్వన్తి=చేయు | ” |

## వాక్యప్రయోగాః

| | |
|---|---|
| గజః గచ్ఛతి | గజాః గచ్ఛన్తి |
| గజః కిం కరోతి? | గజాః కిం కుర్వన్తి |
| గజః గచ్ఛతి. | గజాః గచ్ఛన్తి |
| | |
| బాలః ధావతి | బాలాః ధావన్తి |
| బాలః కిం కరోతి? | బాలాః కిం కుర్వన్తి? |
| బాలః ధావతి | బాలాః ధావన్తి |

| | |
|---|---|
| శిష్యః నమతి | శిష్యాః నమన్తి |
| శిష్యః కిం కరోతి? | శిష్యాఃకిం కుర్వన్తి? |
| శిష్యః నమతి | శిష్యాః నమన్తి |
| | |
| రామః పఠతి | రామాః పఠన్తి |
| రామః కిం కరోతి? | రామాః కిం కుర్వన్తి? |
| రామః పఠతి. | రామాః పఠన్తి |
| | |
| బాలికా ఖాదతి | బాలికాః ఖాదన్తి |
| బాలికా కిం కరోతి? | బాలికాః కిం కుర్వన్తి? |
| బాలికా ఖాదతి | బాలికాః ఖాదన్తి |
| | |
| దేవతా పశ్యతి | దేవతాః పశ్యన్తి |
| దేవతా కిం కరోతి? | దేవతాః కిం కుర్వన్తి? |
| దేవతా పశ్యతి | దేవతాః పశ్యన్తి |
| | |
| సీతా వదతి | సీతాః వదన్తి |
| సీతా కిం కరోతి? | సీతాః కిం కుర్వన్తి? |
| సీతా వదతి | సీతాః వదన్తి |
| | |
| అంబా పిబతి | అంబాః పిబన్తి |
| అంబా కిం కరోతి? | అంబాః కిం కుర్వన్తి? |

| | |
|---|---|
| అంబా పిబతి | అంబాః పిబన్తి |
| పుష్పం వికసతి | పుష్పాణి వికసన్తి |
| కిం వికసతి? | కాని వికసన్తి? |
| పుష్పం వికసతి | పుష్పాణి వికసన్తి |
| ఫలం పతతి | ఫలాని పతన్తి |
| కిం పతతి? | కాని పతన్తి? |
| ఫలం పతతి | ఫలాని పతన్తి |

**అభ్యాసః**

**1. క్రింది ప్రశ్నలకు సమాధాన మిమ్ము.**

1. కః గచ్ఛతి?
2. కా పఠతి?
3. కిం వికసతి?
4. కే నమన్తి?
5. కాః పశ్యన్తి?
6. కాని వికసన్తి?

**౨.క్రింది వానికి ఏకవచనరూపములు తెలుపుము.**

1. గజాః గచ్ఛన్తి.
౨. అంబాః వదన్తి.
3. బాలాః ధావన్తి.
4. దేవతాః ఖాదన్తి.
5. శిష్యాః నమన్తి.
6. ఫలాని పతన్తి.

**3. క్రింది వానికి బహువచనరూపము లిమ్ము.**

1. బాలా నమతి.
౨. గజః పిబతి.
3. శిష్యః వదతి.
4. పుష్పం వికసతి.
5. అంబా పశ్యతి.
6. సీతా వదతి.

**4. క్రింది ప్రశ్నలకు సమాధాన మిమ్ము.**

1. రామః కిం కరోతి?
2. బాలా కిం కరోతి?
3. కిం వికసతి?
4. కే పతన్తి?
5. అంబాః కిం కుర్వన్తి?
6. దేవతాః కిం కుర్వన్తి?



## శబ్దమఞ్జరీ

## (అజన్తపుంలింగ సాధారణ శబ్దాః)

### 1. అకారాన్తః పుంలింగో రామశబ్దః (రాముడు)

| వి. | ఏకవచనమ్ | ద్వివచనమ్ | బహువచనమ్ |
|---|---|---|---|
| ప్ర. | రామః | రామౌ | రామాః |
| సం.ప్ర. | హే రామ | హే రామౌ | హే రామాః |
| ద్వి. | రామమ్ | రామౌ | రామాన్ |
| తృ. | రామేణ | రామాభ్యామ్ | రామైః |
| చ. | రామాయ | రామాభ్యామ్ | రామేభ్యః |
| పం. | రామాత్ | రామాభ్యామ్ | రామేభ్యః |
| ష. | రామస్య | రామయోః | రామాణామ్ |
| స. | రామే | రామయోః | రామేషు |

ఏవం కృష్ణః, గోవిన్దః, ముకున్దః, శివః, నిలయః, వృక్షః ఇత్యాదయః.

### ౨. ఇకారాన్తః పుంలింగో హరిశబ్దః (విష్ణువు)

| హరిః | హరీ | హరయః |
|---|---|---|
| హే హరే | హే హరీ | హే హరయః |
| హరిమ్ | హరీ | హరీన్ |
| హరిణా | హరిభ్యామ్ | హరిభిః |
| హరయే | హరిభ్యామ్ | హరిభ్యః |
| హరేః | హరిభ్యామ్ | హరిభ్యః |

| | | |
|---|---|---|
| హరేః | హర్యోః | హరీణామ్ |
| హరౌ | హర్యోః | హరిషు |

ఏవం కవిః, అగ్నిః, రవిః, దాశరథిః ఇత్యాదయః

**3. ఉకారాన్తః పుంలింగో గురుశబ్దః (గురువు)**

| | | |
|---|---|---|
| గురుః | గురూ | గురవః |
| హే గురో | హే గురూ | హే గురవః |
| గురుమ్ | గురూ | గురూన్ |
| గురుణా | గురుభ్యామ్ | గురుభిః |
| గురవే | గురుభ్యామ్ | గురుభ్యః |
| గురోః | గురుభ్యామ్ | గురుభ్యః |
| గురోః | గుర్వోః | గురూణామ్ |
| గురౌ | గుర్వోః | గురుషు |

ఏవం విష్ణుః, భానుః, విధుః ఇత్యాదయః.

**4. ఋకారాన్తః పుంలింగో ధాతృశబ్దః (బ్రహ్మ).**

| | | |
|---|---|---|
| ధాతా | ధాతారౌ | ధాతారః |
| హే ధాతః | హే ధాతారౌ | హే ధాతారః |
| ధాతారమ్ | ధాతారౌ | ధాతౄన్ |
| ధాత్రా | ధాతృభ్యామ్ | ధాతృభిః |
| ధాత్రే | ధాతృభ్యామ్ | ధాతృభ్యః |
| ధాతుః | ధాతృభ్యామ్ | ధాతృభ్యః |
| ధాతుః | ధాత్రోః | ధాతౄణామ్ |
| ధాతరి | ధాత్రోః | ధాతృషు |

ఏవం శాస్త్రా, కర్తా, ఇత్యాదయః.

**5. ఋకారాన్తః పుంలింగః పితృశబ్దః (తండ్రి).**

| | | |
|---|---|---|
| పితా | పితరౌ | పితరః |
| హే పితః | హే పితరౌ | హే పితరః |
| పితరమ్ | పితరౌ | పితౄన్ |
| పిత్రా | పితృభ్యామ్ | పితృభిః |
| పిత్రే | పితృభ్యామ్ | పితృభ్యః |
| పితుః | పితృభ్యామ్ | పితృభ్యః |
| పితుః | పిత్రోః | పితౄణామ్ |
| పితరి | పిత్రోః | పితృషు |

ఏవం జామాతా, భ్రాతా ఇత్యాదయః.

**(అజన్త స్త్రీలింగ శబ్దః)**

**6. ఆకారాన్తః స్త్రీలింగో రమాశబ్దః (లక్ష్మి)**

| | | |
|---|---|---|
| రమా | రమే | రమాః |
| హే రమే | హే రమే | హే రమాః |
| రమామ్ | రమే | రమాః |
| రమయా | రమాభ్యామ్ | రమాభిః |
| రమాయై | రమాభ్యామ్ | రమాభ్యః |
| రమాయాః | రమాభ్యామ్ | రమాభ్యః |
| రమాయాః | రమయోః | రమాణామ్ |
| రమాయామ్ | రమయోః | రమాసు |

ఏవం సీతా, భామా, పద్మా ఇత్యాదయః.

## ధాతురూపాణి

భూ-సత్తాయామ్ (=ఉండుట)

### (1) వర్తమానే లట్

| | ఏ. | ద్వి. | బ. |
|---|---|---|---|
| ప్రథమపురుషః | భవతి | భవతః | భవన్తి |
| మధ్యమపురుషః | భవసి | భవథః | భవథ |
| ఉత్తమపురుషః | భవామి | భవావః | భవామః |

### (2) విధ్యాద్యాశీషు లోట్

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | భవతు/భవతాత్ | భవతామ్ | భవన్తు |
| మ. పు. | భవ/భవతాత్ | భవతమ్ | భవత |
| ఉ. పు | భవాని | భవావ | భవామ |

### (3) అనద్యతనభూతే లఙ్

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అభవత్ | అభవతామ్ | అభవన్ |
| మ. పు. | అభవః | అభవతమ్ | అభవత |
| ఉ. పు. | అభవమ్ | అభవావ | అభవామ |

### (4) భవిష్యతి లృట్

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | భవిష్యతి | భవిష్యతః | భవిష్యన్తి |
| మ. పు. | భవిష్యసి | భవిష్యథః | భవిష్యథ |
| ఉ. పు. | భవిష్యామి | భవిష్యావః | భవిష్యామః |

## సంఖ్యావాచకశబ్దాః

| పుంలింగే | స్త్రీలింగే | నపుంసకలింగే | |
|---|---|---|---|
| ఏకః | ఏకా | ఏకమ్ | 1 |
| ద్వౌ | ద్వే | ద్వే | 2 |
| త్రయః | తిస్రః | త్రీణి | 3 |
| చత్వారః | చతస్రః | చత్వారి | 4 |

### త్రిషు లింగేషు సమానాః

| | | | |
|---|---|---|---|
| పంచ | 5 | అష్ట | 8 |
| షట్ | 6 | నవ | 9 |
| సప్త | 7 | దశ | 10 |

### వాక్యప్రయోగః

| | | |
|---|---|---|
| ఏకః గజః | ఏకా లతా | ఏకం పుస్తకమ్ |
| ద్వౌ గజౌ | ద్వే లతే | ద్వే పుస్తకే |
| త్రయః గజాః | తిస్రః లతాః | త్రీణి పుస్తకాని |
| చత్వారః గజాః | చతస్రః లతాః | చత్వారి పుస్తకాని |

| | |
|---|---|
| పంచ | గజాః/ లతాః/ పుస్తకాని |
| షట్ | బాలాః/ మాలాః/ పాత్రాణి |
| సప్త | సముద్రాః/ మాతరః/ ఫలాని |
| అష్ట | విద్యాలయాః/ ఘంటాః/ పుష్పాణి |
| నవ | కాకాః/ వీణాః/ నక్షత్రాణి |
| దశ | దేవాః/ బాలికాః/ నేత్రాణి |

**అభ్యాసః**

**1.సంస్కృతములోనికి అనువదింపుము.**

1) ఒక గంట 2) రెండు పండ్లు 3) మూడు ఏనుగులు
4) నాలుగు కాకులు 5) ఐదు పూలు 6) ఆరు దండలు
7)ఏడు పాత్రలు 8)ఎనిమిది పుస్తకములు 9) తొమ్మిది వీణలు
10) పదిమంది బాలురు.

**2.ఖాళీలు తగిన సంఖ్యావాచక శబ్దములచే పూరింపుము.**

1) 4 బాలికాః 2) 1 దేవః.
3) 3 దేవాః 4) 5 పుష్పాణి.
5) 6 కాకాః 6) 7 నక్షత్రాణి.
7) 8 ఫలాని. 8) 9 గజాః.
9) 10 మాలాః. 10) 2 నేత్రే.

**3.తగిన పదములతో జత చేయుము.**

| | |
|---|---|
| త్రయః | మాలాః |
| ఏకః | బాలాః |
| చత్వారః | గజః |
| తిస్రః | దేవాః |
| ద్వౌ | కాకాః |
| ఏకం | బాలా |
| ద్వే (స్త్రీ) | పుస్తకమ్ |
| ఏకా | ఫలాని |
| చతస్రః | నక్షత్రాణి |

| త్రీణి | లతే |
|---|---|
| చత్వారి | బాలౌ |

## పూరణార్థకశబ్దాః

| పుంలింగాః | స్త్రీలింగాః | నపుంసకలింగాః | |
|---|---|---|---|
| ప్రథమః | ప్రథమా | ప్రథమమ్ | = మొదటి |
| ద్వితీయః | ద్వితీయా | ద్వితీయమ్ | = రెండవ |
| తృతీయః | తృతీయా | తృతీయమ్ | = మూడవ |
| చతుర్థః | చతుర్థీ | చతుర్థమ్ | = నాల్గవ |
| పంచమః | పంచమీ | పంచమమ్ | = ఐదవ |
| షష్ఠః | షష్ఠీ | షష్ఠమ్ | = ఆరవ |
| సప్తమః | సప్తమీ | సప్తమమ్ | = ఏడవ |
| అష్టమః | అష్టమీ | అష్టమమ్ | = ఎనిమిదవ |
| నవమః | నవమీ | నవమమ్ | = తొమ్మిదవ |
| దశమః | దశమీ | దశమమ్ | = పదవ |

## వాక్యప్రయోగః

| | |
|---|---|
| ప్రథమః పాఠః. | షష్ఠం పుస్తకమ్. |
| ద్వితీయా ఘంటా | సప్తమః సముద్రః |
| తృతీయం ఫలమ్ | అష్టమీ వీణా |
| చతుర్థః బాలః. | నవమం నక్షత్రమ్ |
| పంచమీ తిథిః | దశమఃదేవః |

## ఉపాధ్యాయుల బోధనోపయుక్తములగు చిత్రములు

విద్యార్థులకు సూచన : ఈ చిత్రముల నాధారముగ చేసికొని సంస్కృతములో ప్రశ్నలు - సమాధానములు చెప్పవలయును .







